శ్రీ శ్రీనివాసచు... శ్రీ॥



# వివిధానంద గ్రంథమాల

# భక్తానందము

(ప్రథమసుమము)



గ్రంథకర్తలు శ్రీరామశ్యాములు.


శ్రీ శారదా ముద్రాక్షరశాల
చిత్తూరు.

1920.

వెల] [అణాలు ౦—౨—౦.

# విజ్ఞప్తి.

---

మహాశయులారా!

"వివిధానంద గ్రంథమాల" యను పేరంగొన్ని చిన్న పొత్తంబుల వెలయింపందలపెట్టి యిదిసాధ్యమాయంచు నెడంద దిగులొందియు భాషాసేవగదా! యనుతృప్తిమైకొన నుడుత భక్తిందలంచి యీ "భక్తానందము"ను వెలిపఱుప సాహసించితిమి. ఇది ప్రథమప్రయత్న మగుటచేందప్పులు మెండుగనుండును. అయిన నీ గ్రంథమును వ్రాయం బ్రోత్సహించిన మామిత్రమండలివలెనే, భాషాభిమానులెల్లరును మాయుద్యమమునకుం దోడ్పడి దోసంగులం దెలిపినచోం గృతజ్ఞతతో నందుకొని పునర్ముద్రణమున సవరించి కొనంగలము. ఇందు భగవద్వ్యాసాసక్తుల యుపయోగార్థ మేకవచన ప్రయోగము నిలిపియున్నాము.

ఇట్లు విన్నవించు,

బుధజనవిధేయులు,

శ్రీ రామశ్యాములు.

## ఉద్యమము.

ధీమంతుల్దలలూఁచిమెచ్చఁగనుబ్బ ఖ్యాందేశభాషావళిన్
స్థేమాధిక్య పదప్రయుక్త రసభూతిం జెన్నునాంధ్రంబునన్
సామాన్యుల్ఘన పండితాళిగొనన స్మన్మిత్రవాంఛాప్తి, శ్రీ
రామశ్యాముల మేమొనర్చెదము సద్గ్రంథంబుల్ శ్రాంతముల్॥

## అంకితము.

రామశ్యామలకోమలాంగ! నుతపాత్రా! మంగళాకార! శ్రీ
రామశ్యాముల కుంభమోదివయియాంధ్రంబందుమాయిచ్ఛప్ర
జ్ఞామేయప్రతిపాద్య పద్య వివిధానంద ప్రసూనంబులన్
శ్రీమన్మూర్తిఁగొని తేర్చిప్రోవుకరుణన్ గృష్ణా!జగద్రక్షకా!

ఓం.

# శ్రీ శ్రీనివాసచరణౌశరణమ్.

## భక్తానందదము.

శా॥ శ్రీనాగాంగమలాలయుంగణపతిన్ శ్రీకంఠుదాక్షాయణిన్
నానాజీవవిధానుశారదనువిజ్ఞానప్రదీపాత్ములన్
శ్రీనాథాదికవీంద్రులన్ గురువులన్ జేమోడ్పుసంధించుమన్
గీనాశక్తియకావ్యసిద్ధిదలఁతున్ గృష్ణా! జగద్రక్షణా! ౧

శా॥ నీమీఁదన్ గృతిసెప్పలేనికవితల్ నీధ్యాసలుల్లేనిదు
ష్ప్రామాణ్యంబులునీకథల్ విననిశ్రోత్రల్ నీగుణంబుల్మదిన్
వేమాటుల్గణియింపలేనిమౌక్తికల్ నిక్కంబుగావ్యర్థముల్
ప్రేమన్ మానసభక్తిలేనివయునన్ గృష్ణా! జగద్రక్షణా! ౨

మ॥ నినుధ్యానింపమనంబునిల్వదునిను న్వీక్షింపబల్మాయతా
నినుసేవింపఁగశక్తిలేదశనము న్నిష్ఠాప్తినీయంత్రబద
ద్ధునముల్ సేయఁబ్రపంచగర్భుఁడవునీ సంతుష్టి "నేనే" రథ
క్తినినాచేసెదువందనంబుఁగొనుమా కృష్ణా! జగద్రక్షణా! 3

మ॥ హరియంచున్ సురవైరిబాలుఁడుకృపన్ యాచింపరక్షించితే!
శరణంబన్నవిభీషణుంబిలిచిరాజ్యంబేలఁగాఁజేసితే!
కరిమొఱ్ఱోయనఁగాచినావుగద సత్కారుణ్యమేపారనన్
గెరలంజూచెదవేమిన్యాయమిది? శ్రీకృష్ణా! జగద్రక్షణా! ౪

మ॥ నీలావణ్యమునీచరిత్రములువర్ణింపంగలేకుండవ్య
ర్థాలాపంబులనాడుచుంటినవిసుంతైనన్ సహాయంబుగా
నీలోకంబునుజూపఁజాలనివివా నింగూర్చిచింతించివే
రేకుండఁగనీకథల్ నుడువుదున్ గృష్ణా! జగద్రక్షణా! ౫

ఉదయంబస్తమయప్రకాశదినము ఖ్యంబోలిసర్వంబునీ
యాదరంబందుఁగుదిర్చికొంచువెలికిన్ యోగ్యంబుగావీడుదాఁ
గద! యీకార్యముకోసమైతికమతా కారంబునైజంబునీ
కిదిసామాన్యప్రవృత్తియాఁదలఁపఁగాఁ గృష్ణా జగద్రక్షణా! ౬

శా॥ నీలోలోకములున్న యప్పుడలయము; న్నీవేవెలింజేయున
ట్లైలోకంబులసృష్టి; వేడుకలుగా వీక్షించు చేరక్షు;సై
బాలుండై వటపత్ర శాయివగుచున్ బ్రాపంచికద్రష్టవై
లీలామానుషవేషమూఁద నరుటల్ కృష్ణా!జగద్రక్షకా! ౭

మ॥ ఒకచోటన్ క్షణమైన నాఁగఁడల సూర్యుం డెప్పుడున్ వార్ధియిం
చుకరైనఁదన మేరమీఱదు; వహించున్ భూమి సర్వంబు;నో
పికవీచుంబవనుండు; మేఘములు నే వేళంజలంబిచ్చు;శౌ
రికృతంబద్దిర!చండశాసనములౌఁ! గృష్ణా!జగద్రక్షకా! ౮

శా॥ మచ్ఛంబై, కమఠంబు, సూకరమవై మానుష్యసింహంబవై
స్వేచ్ఛన్ వామనుఁడై భృగుండవయిప్ర ధ్వీశుండవై శౌరివై
మ్లేచ్ఛారణ్యదవాగ్ని కల్కివయి భూ మిందుష్టసంహారివై
యిచ్ఛాలీలవిహారమందెదవు శ్రీ కృష్ణా! జగద్రక్షకా! ౯

మ॥ అవతారంబులు లెక్కలే వజహాసల్ వ్యాపారముల్ "నేరమం"
చువచింపన్ బసివాఁడమూఢుఁడనుమం దుండన్ విశేషించిని
న్నవలోకించిమహద్విలాసములసా నందంబుగా వ్రాసినీ
కివియర్పింపగనెంత? సన్నుతములే కృష్ణా!జగద్రక్షకా! ౧౦

మ॥ ఖరములక్కుంకుమపూవు మోసిననుద ద్గంధంపుసారస్యమా
ఖరముల్ నేరనియట్లు మండుకములున్ గంజంబులందుండిమా
ధురిమం గాననిరీతిమానసమ్మునం దుందేజమై మెప్పునీ
యిరవుం గాననివారిజన్మమువ్యథా కృష్ణా! జగద్రక్షకా! ౧౧

మ॥ ఒకఁడన్నంజగడాలఁగొండిసుతుఁడౌ నొక్కండుముక్కోపియౌ,
నొకటందానెకులాలకుండగుటన త్యుద్దీప్తవాచాలక
ప్రకటాఘ్యన్ సతినిన్ వహించనవివైరం బిల్లులేకుంటఁజా
విఁకమేలంచుశిరంబువీడె విధియున్ గృష్ణా!జగద్రక్షకా! ౧౨

మ॥ చపలంబైనసిరిన్ జడంపుఁ బృథివిన్ శయ్యాధ్వజద్వేషమున్
దపనంబిచ్చుననంగుఁడౌ సుతునిసంద్రంబందువాసంబునన్
ద్రపలో నీ బహువేషధారియయిత్తు ద్వ్యాధన్నివర్తించుటల్
కృపణంబంచుఁదలంచిదారుశయిలో!కృష్ణా!జగద్రక్షకా! ౧3

శా॥ భూమల్లుప్రతునివాహముఁ దినుటసా మ్ముల్ పుత్రవాహంబుతో
శోషింపన్ హరిపుత్రు పైఁగవియవి ష్ణోద్భూతకాత్యాయనీ
ద్వేషంబున్ ధనదుండు మిత్రుఁడయితా దిక్పాలుఁడై శూలి మా
ర్వేషంబున్ ధరియించిత్రా విసమున్ గృష్ణా! జగద్రక్షణా ౧౪

మ॥ మదిసంకల్పపరీక్షమాత్రమునని ర్మాణంబునన్ బోషయున్
వధయుంజేయుఘనుల్ త్రిమూర్తులెగృహవ్యా ద్యంబులంజిక్కి రాఁ
గదరా! గొంతెమకోర్కులైనఁగొనసా గన్ జేయఁగావచ్చునీ
పృథివిన్ సంస్కృతివార్థినీఁద నెవఁడో? గృష్ణా! జగద్రక్షణా! ౧౫

మ॥ బలిభూనాథుఁడు ద్రోహమేమితలఁచెన్ వ్యాహోటకౌర్యుండువా
లిలవంబేనపరాధమేమిసలిపెన్ లేశంబు రారాజునుం
బలమున్వారలపైనిజాపితివిన న్బాధించుటల్పాదనీ
కిలసామాన్యమె కాక వేరగునె? యో కృష్ణా! జగద్రక్షణా! ౧౬

మ॥ హరియన్నంబరమాత్మఁడంద్రు హరిభ క్తాగ్రేసరుల్ బుద్ధులై
హరుఁడన్నంబరమేశుఁడంద్రు హరభ క్తాగ్రేసరుల్ వీరులై
మతినాపైపెసిగపట్లఁబేరమున మ ర్మంబిద్ది వైకుంఠుఁడున్
గిరిజాధీశ్వరుఁడొక్కఁడంచెఱుఁగరో కృష్ణా! జగద్రక్షణా! ౧౭

మ॥ హరియంచున్హరయంచు నెట్టులనినన్ యావన్మహాపాపముల్
పరిహారంబగునంచునమ్మియెదలోఁ బల్మాఱు నీ నామమున్
స్థిరభక్తిన్భజియించు పుణ్యులనులా తింజాతువే నీవు? ము
క్తిరయంబేదయ సేయుచుందువుగదా కృష్ణా! జగద్రక్షణా! ౧౮

మ॥ పరివారల్ నగుచుండ బంధువులు బ ల్చాకన్విలోకింపనో
ప్పరికింపన్ హితులెల్ల శాత్రవులుకో పాటోపులై విప్లవం
బరయం గానరికట్లబాధ ఋణసం బంధుల్వగన్ జెంపవా
రిరసంబుల్ ఫలియింపఁజేతువకటా కృష్ణా! జగద్రక్షణా! ౧౯

శా॥ ఆయుష్కాలమునూఱువత్సరములం దర్ధంబు రాత్రంబులౌ
న్నాయర్ధంబునబాల్యమందుఁబదిరెం డబ్దంబులం గ్రీడలం
ద్రోయన్మ్రందటిపంచవింశతిగృహాస్థుండౌ జరాభారధా
రేయుండై పసునైదు, లేమస్తుతికిం గృష్ణా! జగద్రక్షణా! ౨౦

॥ బాలుండైనపుడాటపాటలనుచుం బ్రార్థింపఁగాఁజాలఁ సం
శీలంబున్ స్మృతియుంగనంబడదుగా సింజెందినంగాని నేఁ
బాలకా! ధ్రువునంతనోముఁగనవి శ్వవ్యాప్త! నీపాదముల్
రేలుంబుప్రసమున్ మంచినమ్మితి సెదకా కృష్ణా! జగద్రక్షకా! ౨౧

మ॥ కఫవాతంబులు క్రమ్మ యంధబధిరాంగంబుల్ మతిన్ సార్థకం
బుపలక్షింపనినుం దలంపవుదిలో గాలోచించునో! యొంచునో!
యపమృత్యావశ వీడునో వఱమనో యానాఁటికీనాఁడెనీ
కృపనొందంగఁ దలంచివేడితినహో! కృష్ణా! జగద్రక్షకా! ౨౨

శా॥ కష్టంబే ప్రతిరోజునం గలిగెడిం గాలానుకూలంబులై
నష్టంబే ప్రతికర్మమందొనరున న్యాయానురోధంబులై
కష్టం బెంచఁదగున్ ఫలంబు "నహి" నా కర్మం బెయిల్లొటచే
నిష్టార్థంబులనీవె పూర్ణకరుణన్ కృష్ణా! జగద్రక్షకా! ౨౩

మ॥ కనుఁగొంటిన్ సతిపుత్రబంధుగృహవర్గంబుల్ కనత్స్వర్ణగో
ధనధాన్యాదులు "నావి" "నావ"నుచు గాత్రంబుండునందాఁక నెం
తనియల్లాడినఁ గష్టదుఃఖములసంద్రంబైనసంసారదా
రిని గాన్పింపవు సౌఖ్యసంతసములో కృష్ణా! జగద్రక్షకా! ౨౪

మ॥ తనకెంతో విభవంబు గల్గినను జెంతంగానఁ గావచ్చుభూ
మిని గొన్నన్ బహుబాగటంచు మతినామీఁదన్ మదిన్నిల్పుఁజా
లనియత్యాశకునంతులేదుతుదకే లబ్ధవ్య చేఁజిక్కియే
రిని సౌఖ్యంబుననుంచునో దెలియమో కృష్ణా! జగద్రక్షకా! ౨౫

మ॥ జననంబందినదాదినే బహుళకష్టంబుల్ సహింపోఁడిస
జ్జనసంబంధము లేకదుష్టుఁడయిదుస్సాంగత్యమగ్నుండనై
జననింద్యుండనినన్ను దూఱునుడులాస్వాదించితెంతో విర
క్తినినీపాదములాశ్రయించితినహో కృష్ణా! జగద్రక్షకా! ౨౬

శా॥ ఔరా! యిచ్ఛితి పాంచభౌతికపుదేహంబింద్రియానీకముల్
పోరాటంబొనరింపలేకవశమై పోయెన్మనంబందులోఁ
ఘోరాగ్నిన్ శలభంబువడ్డగతిలోఁ గుందంగఁ జేయించినీ
వీరీతిన్ గనినవ్వుచుంటతగునే కృష్ణా! జగద్రక్షకా! ౨౭

మ॥ తనువుల్ బుద్బుదముల్ కృతాంతునిభటుల్ దన్నీడ్చికొంపోవుచోఁ
ధనసంపాదనమింటనిల్చు సతిపుత్రాదుల్ స్మశానంబుదాఁ
కను నేగింతురుగాని మీఁదజముతోఁ గయ్యంబుగావించిము
క్తినిగావింపను వారినమ్మ ఫలమే? కృష్ణా! జగద్రక్షణా! ౨౮

మ॥ పదినూర్లక్షలుకోట్లుగాధనముసంపాదించి క్షేత్రంబులన్
దుదినిర్మాణముచేసిపోవుతఱిఁగూఁతుల్ కన్నపుత్రుల్ "పసుల్
గదినిర్మించకపోయె" "గుండలములా కర్ణంబులందుండె మీ
రిదిమున్ జూడుఁ"డటంద్రుబాంధవులతోఁ గృష్ణా! జగద్రక్షణా! ౨౯

మ॥ సుతులే సద్గతిమార్గదర్శకులటంచుం బల్కు వాక్యంబులన్
మతియోచింపకుఁడుభీష్ముఁడునసంతానంబునంగందిరే?
శతపుత్రుల్ కురురాడ్వశిష్ఠులను నుచ్ఛస్థానమందుంచిరే?
కృతకర్మంబులఁ గూర్చిపొందు దశలున్ గృష్ణా! జగద్రక్షణా! 3౦

మ॥ అభిమన్యాత్మజుఁడున్ శుకుండుమఱిప్రహ్లాదుండు వైరోచనుం
డిభరాజుంభరతుండుమారుతియునున్ గృష్ణుండుభీష్మాదిస
ద్విబుధుల్ తొమ్మిది భక్తిమార్గములనిన్ వీక్షించిమోక్షస్థులై
రిభవత్పూర్ణకృపాకటాక్షమున శ్రీకృష్ణా! జగద్రక్షణా! 3౧

శా॥ చీమున్నెత్తురమేధ్యమూత్రక్రిమిసం శ్లేష్మాదిదుర్మాంసస
ఘామేయంబగుపాడుదేహమునదే వా!ద్వారముల్తొమ్మిదం
డేమారించెడుచోరులాఱుగురుబుద్ధిం దోఁపిడింగొంచున
న్నీమాయన్ బడఁజాతురీవెగతియో కృష్ణా! జగద్రక్షణా! 3౨

మ॥ విదురుండిచ్చినకూఁటినీళ్ళుప్రియమై విందొప్పభక్షించితే!
సదయంజూచితివుమ్మసేయుఫలముల్ సాపాడియాబోయతన్
ముదమేపారఁగుచేలుఁజూచితడుకుల్ ముట్టింప!మాగ్రంథమున్
వృథగాఁజూడకుమంకితంబుగొని శ్రీకృష్ణా! జగద్రక్షణా! 33

గద్య

ఇది శ్రీకోదండరామకృపోదయకవితాభిరామ శ్రీరామశర్మ
ప్రణీతంబైనవివిధానంద గ్రంథమాలా ప్రథమసుమంబగు
భక్తానందము,
శ్రీకోదండరామార్పణమస్తు.

## సప్తద్వారగోపుర బంధకందము.

క్షితిసుత! ప్రధానా! ధాత్రిధరా! నందసుకుమార! దేవ! ధరధరా!
దయాంబోధి! రమావర! మధుసూదన! వినుతశీల! మహనీయగుణా!

